REGD NO. HNL 18 ESTD : 1930 23-2-1990 శుక్రవారం రు 1.50 లు

# జమీన్‌రైతు

సంపుటి : 61 సంచిక : 8 స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు. మేనేజింగ్ ఎడిటర్ : నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరుడోలేంద్రప్రసాద్



# ఇళ్లమంత్రి ఇంటిదారి?

**రాజధాని రాజకీయాలు**

*

**మా ప్రత్యేకవిలేఖరి**

జీవకారుణ్య సంఘం సభ్యుడు అలా నడచి పోతుండగా తాళేలును కట్టెలో పోరుతున్న సంఘటన ఎదురైంది. నాయనా, కొడితే కొట్టావు కాని, తిరగేసి కొట్టకు, పాపం! చచ్చి పోతుంది అని చెప్పి వెళ్ళాడట. ప్రస్తుతం కోనేరు రంగారావు పట్ల ముఖ్యమంత్రి ప్రవర్తన అలాగే వుంది. ఒక ఐ.ఎ.ఎస్. ఆఫీసరును ఫైళ్ళుచూచి చెప్పమంటే ఏంజరుగుతుంది? ఏంచేస్తారు? కోనేరు రంగారావు సంతకాలు పెట్టిన ఫైళ్ళు చూచి కింది అధికారుల తప్పు ఉన్నదా లేదా అని నిర్ణయిస్తారు. తప్పు లేదనుకోండి. అధికారుల తప్పు ఇందులో లేదు అని తెలుతారు. రాజుగారి చిన్న భార్య పతివ్రత అంటారన్నమాట. మిగిలింది నిర్ణయించవలసింది డా॥ చెన్నారెడ్డి గారే.

ఇదంతా కోనేరు రంగారావు పదవికి ఎసరు అనుకుంటున్నారు. బహుశ బడ్జెట్ సమావేశాలలోగానే రంగారావుకు ఉద్వాసన పలక వచ్చునంటున్నారు. అప్పటివరకూ మునిసిపాలిటి ఫైళ్ళన్నీ ఆగిపోతాయి. పార్టీలు గగ్గోలు పెట్టేస్తున్నారు.

చెన్నారెడ్డి ఒక విధంగా అదృష్టవంతుడు. పదవిలోకి రాగానే ఎదురైన కష్టాల్ని ఆయన చాకచక్యంతో ఎదుర్కొని పరిష్కరించారు. స్పీకర్ రామచంద్రారెడ్డి సమస్య, పి. జనార్దనరెడ్డి పోరు, కామునంపవాల తీరు, ఎదుర్కొన్నారు. మల్లు అనంతరాములు హఠాత్తుగా పోయారు. రాయలసీమ ఆందోళన ప్రస్తుతానికి సద్దు మణిగింది. ప్రత్యర్థి ముఠాకు చెందిన కోనేరు రంగారావు వూబిలో కూరుకున్నాడు. ఆ విధంగా చెన్నారెడ్డికి అన్ని విధాల కలసి వస్తున్నది.

కాని ఎంత ముఖ్య మంత్రి అయినా విల్లరగానూ, టోకుగానూ, అబద్దాలు ఆడితే బయటపడి పోతారు. బుద్ధ విగ్రహాన్ని హైదరాబాదు హుస్సేన్‌సాగర్ మధ్య జిబ్రాల్టర్ అరుగుపై ప్రతిష్టించే విషయంలో చెన్నారెడ్డి చాలా అబద్దాలు ఆడారు. కోటిరూపాయలు నష్టం అని ఒకసారి అన్నారు. విగ్రహం ప్రతిష్టించినా, విరమించినా 5 కోట్ల రూపాయలు నష్టం కనుక ఏంచేయమంటారో చెప్పమని బహిరంగ సభల్లో అన్నారు. తీరాగమనిస్తే ఇప్పటికే పూర్తి చెల్లింపులు జరిగాయని, బుద్ధ విగ్రహ ప్రతిష్టాపనకు కొత్తగా అయ్యే ఖర్చు లేదని తేలింది. బహుశా 15 రోజులలో ప్రతిష్ఠాపనకు అన్నీ సిద్ధం కావచ్చు.

## రామారావుగారూ మీరు రావద్దు!

ఎన్.టి. ఆర్.ను ఉత్తరాది అసెంబ్లీ ఎన్నికల ప్రచారానికి రావద్దని నేషనల్ ఫ్రంట్ ఢిల్లీ నాయకులు కోరారట. అప్పటికే ఆయన హిందీఉపన్యాసాలు తయారు చేసుకొని సిద్ధమయ్యారట. కనుక ఏమైనా సరే అని బయలు దేరారు. గెలిస్తే తన ప్రతిభ, ఓడిపోతే వారి ఖర్మ అనడానికి ఎన్.టి. రామారావు సిద్ధ పడే వెళ్ళారని అంటున్నారు. కాని విశ్వామిత్ర షూటింగ్ మాత్రం రామారావు నిర్విరామంగా కొన సాగి స్తున్నారు. లోగడ ఎన్నికల కోసం హడావుడిగా తీసిన సీన్లు ఆపేసి మళ్ళీ తీస్తున్నారు. దీనితో విజయ ఢంకా మోగించాలని ఆయన కలలు కంటున్నారు. దూరదర్శన్‌లో మళ్ళీ రామారావు సినిమాలు, పాటలు జోరుగా వస్తున్నాయి కదా? వీటన్నింటితో రామారావు రాజకీయంగా పునరుజ్జీవనం పొందగండా?

వి.పి.రామారావు కమీషనర్ ఆఫ్ ఎంక్వైరీస్ అనుకోండి. కాని కోనేరు రంగారావు మంత్రిగా తన శాఖకు ఎగ్జిక్యూటివ్ హెడ్ కదా! అంటే వి.పి రామారావు వంటి వారికి అధిపతి అన్నమాటే. రేపు బదిలీ అయి ఆయనే రంగారావు శాఖలో పని చేయవచ్చుకూడా. అలాంటి అధికారి విచారణ జరపడం ఔచిత్యమా అనే ప్రశ్న వస్తుంది. కనుక వి.పి రామారావు తన పరిమితపాత్రను జాగ్రత్తగా నిర్వహిస్తారు.

## లోకాయుక్త సీతారామరెడ్డి ?

లోకాయుక్తగా చెన్నారెడ్డికి సన్నిహిత బంధువు జస్టిస్ కొండా మాధవరెడ్డిని నియమిస్తే బాగుంటుందనుకొన్నారట. కాని ఆయన అందుకు నిరాకరించారంటున్నారు. మరీ దగ్గర చుట్టంగావడమే ఒక ప్రధాన కారణం కావచ్చు. మార్గాంతరంగా జస్టిస్ సీతారామరెడ్డిని లోకాయుక్తగా నియమించవచ్చని చెన్నారెడ్డి సన్నిహిత వర్గాలద్వారా తెలుస్తున్నది. లోకాయుక్త పరిధిలో ముఖ్యమంత్రిని కూడా చేర్చాలనే ఆలోచనకు మళ్ళీ జీవం పోస్తారంటున్నారు. కేంద్రంలో ప్రధాని కూడా లోక్‌పాల్ పరిధిలోకి వచ్చారు. ఎన్.టి. రామారావు మాత్రం అదుగో ఇదిగో అంటూ కాలక్షేపం చేశారే గాని లోకాయుక్త పరిధిలోకి తనను చేర్చలేదు!

## కోత ... కోత... కోత ...

## ఇళ్లకూ రోశయ్య కోత పెట్టాడు !

చెన్నారెడ్డి ప్రభుత్వంలో విద్యుత్తు శాఖమంత్రిగా ఉన్న రోశయ్య అతకని అబద్దాలాడుతున్నారు. గత ప్రభుత్వాన్ని తిట్టడం అటు కేంద్రంలోనూ ఇటు రాష్ట్రంలోనూ ఆనవాయితీకాగా, రోశయ్య మరీ మోతాదు మించి అబద్దాలాడుతున్నారు. పరిశ్రమలకు కరెంటు కోత, వ్యవసాయానికి కోత, ప్రస్తుతం గృహస్తులకు సైతం కోత. సహజంగా జనం తిట్టుకుంటారు గదా!. పైగా ఇళ్ళకు కూడా కోత విధిస్తున్నట్లు చెప్పకుండా రోజూ ఏదో ఒక వేళ ఇష్టమొచ్చినట్లు కోత విధిస్తున్నారు. ఈ తిట్లన్నీ గత ప్రభుత్వానికి చెందాలని రోశయ్య ఉద్దేశం. అందుకని తెలుగుదేశం ప్రభుత్వం ఒక్క యూనిట్ కరంట్‌కూడా ఉత్పత్తి చేయలేదని ఆవేశారు. వాస్తవానికి విజయవాడ థర్మల్‌స్టేషన్ రెండవ స్టేజి ఉత్పత్తి ప్రారంభించి రోజుకు 48 లక్షల చొప్పున మొత్తం 210 మెగావాట్లు ఉత్పత్తి చేస్తున్నది. అలా విద్యుత్తు 1488 నుండి 2322 మెగావాట్లకు పెరిగింది. ఈ నిజాలను దాచకపోతే రోశయ్య భరించలేరు.

# కాంగ్రెస్‌పార్టీ దక్షిణాదికి వలస రావలసిందేనా?

సర్గా ఆమె నెల క్రితం- మా దేశ స్వాతంత్ర్యం సాధించిన జాతీయ కాంగ్రెస్ పార్టీ ఉత్తరాది పార్టీగామిగిలిపోతుందావిందయ్యే పర్యాటా సమ రాజకీయ శక్తి కోల్పోయిందా దక్షిణ భారత దాన్ని మర్చిపోతున్నదా! వంటి ప్రశ్నలు రాజకీయవాదులను ఉక్కిరిబిక్కిరి చేశాయి.

ఈరోజు- కాంగ్రెస్ పార్టీ దక్షిణాది పార్టీగా మిగిలిపోనున్నదా? విద్యాపర్వ కాం తీవలకు వలసవచ్చేసిందా? దక్షిణ భారతీయులే తమకు అప్పటి నిర్ణయించు కున్నారా అన్న అనుమానాలు తలెత్తు తున్నాయి.

అకంటే ఆమె నెలలో భారత రాజకీయాలు, భారత జాతీయ కాంగ్రెస్ జాతకం కూడా మారిపోయాయి. ఆ రోజు దక్షిణాది లోని ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, కేరళంలో కాంగ్రెస్‌ను ప్రజలు ఆదరిస్తా రన్న ఆశ ఇసుమంతకూడాలేదు. తెలుగు దేశం, డి ఎం కె, జనతాదళ్, కమ్యూనిస్టుల ప్రాబల్యం ఈ నాలుగు రాష్ట్రాలలోనూ శాశ్వతంగా తమకు దత్తత తీసుకొన్నట్లే కన్పించాయి. కాంగ్రెస్ అధ్యక్షుడు రాజీవ్ గాంధీ సైతం ఈ రాష్ట్రాల పార్టీ వ్యవహారాలను పెద్ద సీరియస్‌గా తీసుకొనేవాడు కాదు. తమిళనాడులో 13 పర్యాయాలు పర్యటించినా, ఆ శాసనసభలో తమ పార్టీ 3వ స్థానంలోకి నెట్టివేయబడటంతో ఆయన దక్షిణాదిపై ఆశలు వదులుకొన్నట్లే కనబడ్డాడు.

కానీ పార్లమెంట్ ఎన్నికలతో పరిస్థితి పూర్తిగా తలక్రిందులై పోయింది. ఆశ వదులుకున్న దక్షిణాది ప్రజలు, అనూహ్య ఆదరణతో కాంగ్రెస్‌ను గెల్పించారు; రాజీవ్‌గాంధీ తమవారనుకున్న ఉత్తరాది ప్రజలు, ఆయన్ను అధికారం వదలుకో

మని ఆదేశించారు. ఎంతలో ఎంత మార్పు ఇది!

పార్లమెంట్ ఎన్నికలు గడిచి నిండా 3 నెలలు నిండలేదు అప్పుడే అసెంబ్లీ ఎన్నికలు వచ్చిపడ్డాయి. అందులోనూ,

## 8 రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలలో అంత ర్యుద్ధాలు కాంగ్రెస్ పార్టీ భవిష్యత్‌ను అయోమయంలో పడవేస్తున్నాయి; తాత్కాలికంగానైనా రాజీవ్‌గాంధీ నాయకత్వం దక్షిణాదికి పరిమితంకాక తప్ప దేమోనన్పిస్తున్నది!

ఎన్నికలు జరిగే రాష్ట్రాలలో అత్యధిక భాగం ఉత్తరాదివే! మొన్నటి పార్లమెంట్ ఎన్నికలలో కాంగ్రెస్‌ను నిరాదరించిన ప్రజలే,ఇప్పుడు మరోసారి తమ నిర్ణయం ప్రకటించబోతున్నారు. నూడ రోజుల జనతాదళ్ పార్టీ పరిపాలనపై ప్రజల తీర్పు వెలువడనున్నది. ఆ తీర్పులోనే

కాంగ్రెస్ భవితవ్య నిర్ణయం కూడా జరిగి పోతుంది.

మొన్న జరిగిపోయిన మణిపూర్ ఎన్నికను మినహాయిస్తే రేపు 27 తేది 8 రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతమైన పాండిచేరిలలో శాసనసభలకు పోలింగ్ జరుగుతుంది. స్థానికంగా చెలరేగిన అసంతృప్తులు, చిల్లరమల్లర తిరుగుబాట్లు తప్ప కాంగ్రెసేతర పక్షాలకు సంబంధించి పార్లమెంట్ ఎన్నికల నాటికి, నేటికి పరిస్థితిలో పెద్దగా తేడాలేదు. అప్పటి మాదిరే ఇప్పుడూ వారు సీట్ల సర్దుబాట్లు చేసుకున్నారు. అరోజువలెనే, మహారాష్ట్ర మినహా మిగతా అన్ని రాష్ట్రాలలో ముఖాముఖి పోటీలు వుండేటట్లు జాగ్రత్తపడ్డారు. ఆ ఎన్నికవలెనే ఈ ఎన్నికనూ రావణ బ్రతుకుల పోరాటంగా పరిగణించి పని చేస్తున్నారు. అందువల్లనే అన్ని రాష్ట్రాలలోనూ ఎన్నికల సమరం హోరాహోరీగా వుంది. రాష్ట్రాలవారీగా అసెంబ్లీ ఎన్నికల పరిస్థితి స్థూలంగా ఇదీ!

### మహారాష్ట్రలో నలు చదరపు పోటీ

లోక్‌సభ ఎన్నికలలో మహారాష్ట్రలో ముక్కోణపు పోటీలు జరిగితే, ఇప్పుడు చతుర్ముఖపోటీ జరుగుతున్నది. కాంగ్రెస్ మహారాష్ట్ర ఇందిరాకాంగ్రెస్, జనతాదళ్ కూటమి, బి. జె. పి.-శివసేనల జంట విడి విడిగా పోటీచేస్తున్నాయి. ఎం. ఐ. సి. ని మినహాయిస్తే తక్కిన అందరిలోను తమదే గెలుపన్న ధీమావుంది.

288 సీట్లుగల మహారాష్ట్ర అసెంబ్లీలో 1985 ఎన్నికలలో కాంగ్రెసుకు 160, శరద్‌పవార్‌కు 54 సీట్లు వచ్చాయి. తర్వాత ఈ రెండుసంఖ్యలూ ఒకటైనాయి, తక్కిన అన్నిపార్టీలూ - జనతా (20), బిజెపి (16), స్వతంత్రులు (19), సి. పి. ఐ. (2), సి. పి. ఎం. (2), ఇతరులు (18) - కలిసి వున్న సీట్లు 72. అంటే కాంగ్రెసులో 3 వంతుమాత్రమే.

ఇప్పుడు అన్నిపార్టీల కూటములూ కలిసి అన్నిస్థానాలకూ పోటీపెట్టాయి. ముఖ్యమంత్రి పవార్‌దృష్టిలో ఎం.ఐ.సి., జనతాదళ్‌లు అసలు లెక్కించదగినవి కావట. ఆయన తనపోరాటమంతటినీ శివసేన, బిజెపిలపై కేంద్రీకరిస్తున్నారు, అయితే ఎం ఐ సి అభ్యర్థులు 160 స్థానాలలో కాంగ్రెసు ఓట్లు చీల్చేందుకు కంకణంకట్టుకొని పనిచేస్తున్నారు. తాము గెలవలేపోయినా ఫర్వాలేదు-కాంగ్రెసు అధికారంలోకి రాకూడదన్నది వీరిపంతం.

శివసేన, బిజెపిల కూటమి మాత్రం హిందూమతోన్మాదం రెచ్చగొట్టడంద్వారా అధికారంలోకి రావడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆ మతపిచ్చి ఎంతదూరంపోయిందంటే, శివసేన అధ్యక్షుడు బాల్‌థాకరే మితిమీరిన ప్రసంగాలు తమను ప్రజలకెక్కడదూరంచేస్తాయేమోనని బిజెపి భయపడేంత తీవ్రంగావుంది. లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెస్ తర్వాత ఓట్లలో రెండవ స్థానం సంపాదించిన కూటమి ఇది.

స్వంత నాయకుల తిరుగుబాట్లు ఒక ప్రక్క, శివసేన హిందూ మతోన్మాదం ఇంకొకప్రక్క కాంగ్రెస్ పార్టీని చిక్కుల్లో పెట్టాయి. లోక్‌సభ ఎన్నికలవలె అత్తెసరు సీట్ల మెజారిటీ అయినా సాధిస్తుందో, లేక, ప్రతిపక్షంలో కూర్చుంటుందో చెప్పలేము.

—రెండవ 7 వ పేజీలో

● అశ్రుతర్పణం ●



జననం : 11.9.1966 మరణం : 29.2.88

చిన్నవారైనా అందరిచేత మంచి అనిపించుకొని, అకాలంగా మృత్యువాతబడి మాకు దూరమైన

మా చిన్ని

## పెనుబల్లి గిరిధర్

స్వర్గస్థులై 28-2-90 తేదీకి రెండు సంవత్సరాలు నిండుతాయి. అతని పవిత్రాత్మకు దైవసన్నిధిలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ, అశ్రుతర్పణం సమర్పిస్తున్నాము.

నిన్ను మరువలేని

పెనుబల్లి శ్రీనివాసులు (M.R.O. మాచర్ల), వసుంధర

తల్లిదండ్రులు

జితేంద్ర, చక్రధర్-అన్నలు సుమతి-మల్లికార్జున-అక్క, బావ

## పినాకినీ తీరం

### రాజకీయాలలో ఏదీ శాశ్వతం కాదు!

శత్రుమిత్రత్వాలు రాజకీయాలలో శాశ్వతంకాదనే నానుడి నిత్యసత్యమైనది ఎప్పుడు నిజమైనది. అవి రెండేకాదు, పదవులు అధికారాలు, కీర్తి ప్రతిష్ఠలు కూడా రాజకీయాలలో అశాశ్వతాలే. అసలు రాజకీయవాది అంగ నిర్మాణమే ప్రత్యేకంగా వుండాలి; ఎక్స్‌ట్రా స్ప్రింగ్‌గా వుండాలి; అందరి అవయవాలవలె వారివి అసిర్తుగావుంటే ఒక్క దెబ్బకు పనికి రాకుండాపోతాయి. ఈసూక్ష్మం గ్రహించే విధాతకూడా రాజకీయవాదుల సృష్టి విషయంలో కాస్త ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నట్లున్నారు. ఎంత శ్రమపడినా, ఎన్ని గంటలసేపు పనిచేయవలసివచ్చినా, ఎంత అవిశ్రాంతంగా తిరగవలసివచ్చినా, ఎంతగా నిద్రాహారాలుమాని కాలం గడపవలసివచ్చినా, ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా, తల ఎన్నిబొప్పెలు కట్టినా, ఎంత విశ్వాసఘాతుకానికి గురికావలసివచ్చినా, ఎన్ని అవరోధాలు అడ్డువచ్చినా, ఎన్ని అఘాతంగా ఎదురైనా, ఎంతగా గానీ చెందవలసివచ్చినా వారు అలసిపోరు, వారిలో నిస్పృహ తొటుచేసుకోదు. వారు నిరాశ చెందరు, నిర్వీర్యత వారిచెంత చేరదు. ఎప్పటికప్పుడు ఆత్మవిశ్వాసాన్ని ఆత్మస్థైర్యాన్ని చిక్కబట్టుకొని నిత్యనూతనోత్సాహంతో మామూలుగా ముందుకు సాగుతారు. అవయవాల నిర్మాణం అందరివలె జరిగితే, రాజకీయవాదులు యింత బండవలె, మొండివలె మొక్కవోకుండా నిలబడగలుగుతారా! అంగనిర్మాణంలో ప్రత్యేక పదార్థాలు వుపయోగించకుండే, రాజకీయ వాదుల దేహము ఈ ఘాతాలను తట్టుకొనే విధంగా వరమైనా ప్రసాదించి పంపాలి— బ్రహ్మదేవుడు!

వేళాపాళా, తిండి తిప్పలు, నిద్ర నిప్పలు, విశ్రాంతి విరామం లేకుండా పర్యటిస్తుండే మంత్రులు తక్కుంగల రాజకీయ నాయక ఉపనాయకాదులను చూస్తుంటే అంకుఠితమైన నాబోటివానికి ఆశ్చర్యం గొల్పుతుంటుంది. రాజకీయాలలో వున్నతస్థితికి రావడానికి, ప్రజలతో సంబంధాలు నెరపడానికి ఇవన్నీ అవసరమైన అర్హతలుకాబట్టి యెట్టివారికైనా తప్పవు.

• • •

శాసనసభ్యుడు శ్రీ మాదాల జానకిరామ్ వ్యవసాయమంత్రి శ్రీ జనార్దనరెడ్డిని ఒకరోజు తన ఉదయగిరి నియోజకవర్గంలో త్రిప్పారు. అంతేకాకుండా రోడ్ల మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి పర్యటనకూడా జరిపించారు. ఆ పర్యటనలో వుండిన పార్లమెంటు సభ్యుడు శ్రీ యం. రాజమోహనరెడ్డి ఈ పర్యటనలో చేదు రెండిటి యేర్పాటుచేసింది, ఇదుపరి తోడ వుండింది శ్రీ జానకిరాంమాత్రమే. గ్రూపులరీత్యా వ్యాఖ్యానించదలచుకుంటే శ్రీ రాజమోహన్‌రెడ్డి శ్రీ జనార్దనరెడ్డిగారిని ప్రతికూలుడుగా భావించాడనుకోవాలి. శ్రీ జానకిరాం మాత్రం ఉభయ మిత్రుడన్నమాట!

జనార్దనరెడ్డి పర్యటనసభల్లో ముఖ్యంగా జనం ఎక్కువగావచ్చిన ఉదయగిరి సభలో జానకిరాం ప్రసంగంతీరుచూస్తే, ఉపయోగించిన విశేషణాలుగమనిస్తే ఆయన అంతరాంతరాలలో జనార్దనరెడ్డికికా వ్రతిష్ఠస్థానం ఏర్పడిందనిపిస్తుంది! ఉదయగిరి ప్రజలు జనార్దనరెడ్డికి ఒక మామూలు మంత్రిగా కాక రాష్ట్రనాయకుడుగా అఖండ స్వాగతమివ్వాలని వాక్రుచ్చారు శ్రీ జానకిరామ్. దీన్ని వేదికమీద సాంప్రదాయకంగా వుపయోగించే ముఖప్రీతి పొగడ్తగా పరిగణించవచ్చు. కానీ, కొత్తగా మారివుంటే తప్ప, జానకిరాం స్వభావానికి పొగడ్త అనేది ప్రత్యక్ష విరుద్ధం అని వారికి తెలుసు. అనుకూలంతో ప్రతికూలంతోతప్ప మధ్యేమార్గం అతనికి తెలియదు. ప్రేమించడమో ద్వేషించడమోతప్ప,కపటనాటకం అతనికి చేతకాదు. అమితంమైనా ప్రేమించినా అది ప్రగాఢంగా వుంటుంది. వ్యతిరేకించినా, ద్వేషించినా పరిపూర్ణంగా వుంటుంది. వేదంతదిపిన నోరు అనేదితప్ప నిష్కపటి శ్రీ జానకిరాం. అటువంటి జానకిరాం జనార్దనరెడ్డిని రాజపనంగా రాష్ట్ర నాయకుడుగా పొగిడాడంటే అది నాలుక కొసనుండి వచ్చినమాట అని అనుకోలేము.

1978 లోను, అంతకు పూర్వము జానకిరాం జనార్దనరెడ్డి చాలా సన్నిహితంగా స్నేహానురాగంగా వుండేవారు. ఆ ఎన్నికలలో జానకిరాం ఉదయగిరిలో ఓడిపోతే, అతను ఓడినా తనదృష్టిలో శాసనసభ్యుడేనని జనార్దనరెడ్డి అప్యాయంగా పేర్కొనడం, జనార్దనరెడ్డి పాల్గొనే ప్రతిసభలోనూ తక్కిన అందరు శాసన

—రెండవ 7వ పేజీలో

# జమీన్‌రైతు

## విద్యుత్ కొరత

వైశాఖమాసం కూడా పూర్తికాలేదు; అయినా విద్యుత్ కొరత అతి భయంకరంగా తయారైంది. ఇక ఎండలు ముదిరేకొద్దీ ఈ కొరత ఇంకా ఎంత తీవ్రతరం కాబోతుందో, ఎటువంటి దుస్థితికి చేరుకోబోతుందో వూహించలేము. ఈ క్లిష్టపరిస్థితిని అధిగమించడానికి ప్రభుత్వం ఏమిచర్యలు తీసుకోబోతున్నదో స్పష్టంగా తెలియడంలేదు.

ఈ సంవత్సరం ఈశాన్య ఋతుపవనం నెల్లూరు తదితర ప్రాంతాలను మోసంచేసింది. వర్షపాతం తక్కువ. అందువల్ల మెట్ట ప్రాంతాలలో పరిస్థితి విషమంగావుంది. కొన్ని చెరువుల్లో నీరు వుండవచ్చు; కొన్నిచోట్ల అరకొరగా పండవచ్చు. కాని ఎక్కువభాగంలో దుర్భిక్షమే. కేవలం ఐ. ఆర్. 20 మీద ఆధారపడిన గ్రామాలలో కూడా చివరివరకు నీటిపారుదల వుంటుందనే నమ్మకంలేదు. పంట చేతికొస్తుందనే ధైర్యంలేదు. వర్షాభావంవల్ల ఇక మెట్టపైర్లసంగతి చెప్పవలసిన అవసరమేలేదు. వాటికంటే కూడా విపరీతమైన పెట్టుబడితో పెంచిన మంచినిమ్మవంటి తోటలపరిస్థితి దయనీయం. బావుల్లో నీరుతగ్గిపోయింది. వున్ననీరు తోడుకోవడానికి విద్యుచ్ఛక్తిలేదు శ్రమపడి అప్పుసప్పుచేసి బిడ్డల్ని దాచినట్లు కంటికిరెప్పలా కాపాడుతూ పెంచి ఫలితం అనుభవానికివచ్చే సమయంలో ఆ తోటలు ఎండిపోతూ వుండే నిస్సహాయంగా చూస్తూ వూరుకోవలసి ఆ రైతు ఎంత క్షోభించిపోతాడో వూహకందని విషయంకాదు.

వీటన్నిటికంటే ఆందోళనకల్గిస్తున్న సమస్య మంచినీటిసమస్య. అన్నిచోట్ల ప్రారంభంకాకపోయినా, బావులు ఎండిపోకపోయినా, కొన్నిగ్రామాలలో మాత్రం నీటికొరత ప్రారంభమైనట్లు చెప్తున్నారు. బావులు ఎండిపోయే మెట్టప్రాంతాల్లోనేకాదు రక్షిత మంచినీటిపథకాలు వుండి, నీటికి కొరతలేని డెల్టాగ్రామాలలోసైతం విద్యుచ్ఛక్తి కొరత వల్ల ప్రజలు మంచినీటికొరతను అనుభవించవలసిన దౌర్భాగ్య పరిస్థితి సంప్రాప్తిస్తున్నది.

పెద్దపరిశ్రమలకు అరవైశాతం కోత విధించామన్నారు; అది వ్యవసాయానికి ఎక్కువసమయం సరఫరాయివ్వడానికి చేశామన్నారు. రోజుకు పదమూడు గంటలు వ్యవసాయానికి నమ్మకంగా సరఫరా వుండగలదని ప్రభుత్వం హామీయిచ్చింది. విద్యుచ్ఛక్తాధికార్లు కూడా పగలు ఆరుగంటలు, రాత్రి ఏడుగంటలు రొటేషన్‌పద్ధతిలో సరఫరా అయ్యేట్లుఏర్పాటుచేశామన్నారు కాగితంమీదఈఏర్పాటంతాసలక్షణంగా, పకడ్బందీగానేవుంది. కాని క్రమంతప్పకుండా ఇవ్వగలుగుతున్నారా అనేది ప్రశ్న. పల్లెలనుండి వినబడుతున్నదానినిబట్టి ఈ సరఫరా సక్రమంగా వున్నట్లులేదు. దీనికి స్థానికలోపాలు కారణంకావచ్చు, పైన సరఫరా అవరోధం కారణం కావచ్చు. కారణం ఏదైనా ప్రతి రోజు ప్రతిచోట క్రమంతప్పకుండా పదమూడుగంటలు సరఫరా అందడంలేదనేది యదార్థమైనవిషయం. వ్యవసాయమంత్రి శ్రీ జనార్దన రెడ్డి వ్యవసాయానికి పదహారు గంటలు సరఫరా ఇవ్వవలసిందిగా అధికార్లకు ఆదేశాలిచ్చినట్లు ప్రకటిస్తున్నారు. ముఖ్యమంత్రిగారు కూడా వ్యవసాయానికి ఎక్కువసమయమే కేటాయిస్తున్నారు. కాని ఈ ఆదేశాలు ఎక్కడున్నాయోగాని, క్రిందిస్థాయికి ఇంకా చేరలేదు; పదహారు గంటల సరఫరా ప్రారంభంకాలేదు

పట్టణాలలోకూడా సరఫరాసక్రమంగాలేదు. పేరుకు రోజుకు రెండుగంటలు సరఫరా వుండదన్నారు; కాని ప్రత్యక్షంగా ఒక్కోరోజు ఏడెనిమిది గంటలుకూడా వుండడంలేదు. దీనివల్ల అన్నిరంగాలకు సంబంధించిన కార్యకలాపాలు కుంటుబడిపోతున్నాయి; స్తంభించిపోతున్నాయి. అటు పరిశ్రమలు, ఇటు వ్యవసాయమేకాక, విద్యుచ్ఛక్తి మీదనే ఆధారపడిన ఇతరపనులు కూడా నిల్చిపోతే రాష్ట్రం ఎంత ఆర్థికనష్టాలు కావలసివుంటుందో తలచుకుంటే కృంగిపోవలసి వస్తుంది.

ఏదేశ్య తెలుగుదేశం ప్రభుత్వ నిర్లక్ష్యపు దుష్ఫలితం ఇది. దీన్ని కప్పిపుచ్చుకోడానికి శ్రీ చంద్రబాబునాయుడువంటివారు రెండు నెలల క్రితం అధికారానికి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వాన్ని నిందించడం, ఆందోళన చేస్తామని బెదిరించడం హాస్యాస్పదంగా వుంది. ఈ వివాదానికి ఇది సమయంకాదు. ప్రక్కరాష్ట్రాలనుండి ప్రాధేయపడి సంపాదించడంగాని, లేక సరఫరాలోని లోటుపాట్లను, వృధాలను, దుర్వినియోగాలను అరికట్టి ప్రాణప్రదమైన వ్యవసాయ రంగానికి చెప్పినంతవరకైనా విద్యుత్తు సక్రమంగా సరఫరా జరిగేట్లు ...

# జమీన్‌రైతు

28—2—1940

16 పేజీలు అణా

## నెల్లూరు ముచ్చట్లు

### డి. యస్. పి.

మా పోలీసు సూపరింటెండెంటు వచ్చి నాలుగుమాసాలు కావచ్చింది. అడుగెత్తి బైటపెట్టిన పాపానపోలేదు. వారికి అనారోగ్యమని అశ్వసిదేవత లంటారు. అయితే శలవు దీసుకో గూడదా? ఈ మాటలైనా మేము ధైర్యంగా అడిగినందుకు ఏమి చిక్కులొస్తవో భగవంతునివల్ల?

### గూడూరు బస్టాండువద్ద

బస్సు 1-కి దినానికి 0-1-6 లు వసూలుచేస్తున్నారు పంచాయతీవారు. దినానికి షుమారు 80 బస్సులు సమర్పిస్తున్నవి ఈ ముడుపును. ఈ విధంగా వెయ్యి రూపాయలు వరుమానం. ఆ స్టాండువద్దకు వెళ్ళి ఆ కక్కసులు చూడండి దేవరా ఎంత ఛండాలంగా వున్నవో!

లక్ష్మీనారాయణ రెడ్డిగారూ! ఆ రేకులు కాస్త పీకేసి సిమెంటుతో ఎత్తు ప్లాటుఫారం కట్టి మంచి కక్కసులు కట్టించవయ్యా. మీరువెళ్ళినప్పుడుండేవి చూస్తే ఎంత సంబరంగా ఉన్నవో తమకే తెలుస్తుంది. ఓ హెల్తుకిపార్డు మెంటా! నీవు బ్రతికుంటే యిలాంటి చిన్నవిషయాలైనా నీకంటబడవా?

### కమీషనరూ!

సంతపేట బస్సుస్టాండువద్ద నవాబు నరసింహం ధర్మసత్రం పెట్టు వేశారు. నీ ధర్మాన పూర్వోద్ధారానికి 4 సీట్లు ఏర్పాటు చేయించవయ్యా.

### జడ్జిగారు

కలెక్టరుగారు, జడ్జిగారు 24 తేదీ వెంకటగిరి మకాముట. అది నిజమైతే రాజాగారి అతిథులుగా వుండకతప్పదు గదా! జడ్జిగారు రాజాగారికి అతిథులుగా వుండడానికి వీలేమున్నా నా హృదయం మాత్రం ఒప్పుకోదు; అంతకుముందే నాకలం ఒప్పుకోనే ఒప్పుకోదు.

### ఇంజక్షను ఉత్తర్వు ఆగిపోయింది

వెంకటగిరిలో "రైతుబిడ్డ" ఫిలిం నిషేధానంతరం సినిమా కంటును ప్లీడరు యించడానికిగాను ఎస్టేటువారు తెచ్చిన దావాలో గూడూరు డివిజనల్ జడ్జీగారు గావించిన తాత్కాలిక ఇంజక్షన్ ఉత్తర్వును జిల్లా జడ్జిగారు తొలగించారు. కంపెనీవారి అపీలు 28 తేదికి వాయిదా వేయబడివుంది. సినిమావారు ఆ చిత్రం ఫిలిమును ప్రదర్శిస్తున్నారు.

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

### నెల్లూరు పత్రికారచయితల విలేఖరుల సమావేశము

19 తేదిన శ్రీ చుండి విశ్వనాథం బి. ఎ. బి. ఎల్. (హిందూ పత్రిక విలేఖరి) గారి అధ్యక్షతన జరిగిన సమావేశంలోని తీర్మానాలు. (1) ఈ నెల 8 తేది "ఆంధ్ర" పత్రికలో తెలుప బడినట్టుల కర్నూలు మునిసిపల్ ఛేర్మనుగారు పత్రికా విలేఖరులయెడ జూపిన నిరసనభావాన్ని ఖండిస్తూ, విలేఖరులు పత్రికారచయితల గౌరవమును కాపాడినందుకు వారిని అభినందించుచున్నాము. (2) స్థానిక సంస్థల సమావేశములలోను, ఇతరసభలలోను సభాకార్యక్రమమును తెలుసుకొనుటకు అనుకూలమగుస్థలమును పత్రికావిలేఖరులకు ప్రత్యేకించవలెను.

### చనిపోయినాడు

8 తేదిన యిస్కపల్లిలో చిరుత పులితో కలబడి నెల్లూరు పెద్దాసుపత్రిలో చికిత్స పొందుచుండిన మేడిరెడ్డి సుబ్బులు 21 తేది రాత్రి చనిపోయినాడు.

### ఆచార్య రంగాగారి నెల్లూరు సంచారం

నెల్లూరు జిల్లాలో ఈనెల 21 తేది నుండి 28 తేది వరకు పర్యటనము యేర్పరచుకున్న ఆచార్య రంగాగారు 21 తేది మధ్యాహ్నం యక్స్ప్రెస్‌లో నెల్లూరుకు వచ్చారు. 8 గంటలకు వీరి అధిపత్యాన జిల్లా రైతుసంఘ ఎన్నికలు జరిగాయి.

### ఇండియాలో రైల్వే ఇంజన్లు

ఇండియాలో రైల్వే ఇంజన్లను తయారుచేయుటను గురించి విచారించుటకు నియమింపబడిన యిద్దరు ఆఫీసర్లు తెలిపిన రిపోర్టులో ఈ దేశంలో యిందుకు ఎక్కువ అవకాశం వున్నదనీ పరికరాలన్నీ యిచటదొరుకుననీ, ఇతరదేశాలకంటే చౌకగా తయారు చేయుటకు అవకాశమున్నదని తెలియజేసిరి. ఈ సంవత్సరం యిందుకైతగు ఏర్పాట్లు చేయబడును.

# నాయకుల నిజరూపం ఇదీ!

మంత్రిగా ధార్జీ తీసుకున్న మరుక్షణంలోనే తన మేనల్లుడు చంద్రమోహన్‌రెడ్డికి బ్యాంకు పదవి ఇస్తేతప్ప జిల్లా రైతాంగం, జిల్లా కాంగ్రెస్‌పార్టీ బాగుపడదని ముఖ్యమంత్రికి వ్యక్తిగత జాబు వ్రాయగల్గిన నిజాయితీ ఒక్క నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డిగారికే దక్కింది. అప్నే, స్పిన్నింగ్ మిల్ వంటి సంస్థలకూ తన కుమారులు, అన్న కుమారులు, ఇతరుల పేర్లు సూచిస్తూ, వీరిని నియమిస్తే తప్ప జిల్లా అభివృద్ధి జరగని మంత్రిగారు పేర్కొన్నారట. ధన్యోస్మి! కాంగ్రెస్‌కు పట్టిన ఈ దుర్గతికి చింతించడం తప్ప ఎవరుమాత్రం ఏమి చేయగలరు చెప్పండి?

చంద్రమోహన్‌రెడ్డిగారు బ్యాంకు పదవి స్వీకారం చేస్తూ - పదవిలేని సమయంలో తెలుగుదేశంలోని ఒక్క కుటుంబం తప్ప మరే పార్టీవారూ తనకు అడ్డురాలేదని, అందరూ తనను చేర్మన్‌గానే గుర్తించి గౌరవించారని సెలవిచ్చారు. తనకు పదవి నిచ్చిన పార్టీకి ద్రోహంచేసి, తనపదవి నిల్పుకోవడంకోసం అడ్డదారులు త్రొక్కిన చంద్రమోహన్‌రెడ్డి, పదవీ కాపత్రయానికి తెలుగుదేశం పార్టీలోని వారందరూ సహకరించారని స్వయంగా అంగీకరించడం సామాన్య కార్యకర్తలందరికీ గుణపాఠం కావాలి! పార్టీ మనుగడకోసం, నాయకుల పెరుగుదలకోసం తమలో తాము కుమ్ముకలాడుకొచ్చే కార్యకర్తలు - తమ నాయకుల బతుకెంత ఘనమైనవో, వారు పార్టీకంటే వ్యక్తులనెట్లా ముఖ్యంగా చూస్తారో ఈ ప్రకటనబట్టి తెలుసుకోవాలి!

నెల్లూరు —మూర్తి

### రిజర్వేషన్లు

నుంచి అమలులో వున్న రిజర్వేషన్ల విధానం వారికి ఎంతవరకు ఉపయోగపడిం

# జనవాణి

దన్న విషయం పునరాలోచించుకోవలసిన అవసరం వుంది.

షెడ్యూలు కులాలు, తెగల వారిలో రిజర్వేషన్ సౌకర్యాలను ఉపయోగించుకొని గెజిటెడ్ ఆఫీసరు ర్యాంకుకు ఎదిగిన వ్యక్తి కుటుంబాన్ని తదుపరి రిజర్వేషన్లకు అనర్హులుగా ప్రకటించాలి. ఒక యూనిట్ పొలం వున్న కుటుంబానికికూడా రిజర్వేషన్ల సౌకర్యం వర్తింపచేయకూడదు.

కులాంతో నిమిత్తం లేకుండా అందరికి ఉచిత విద్య ప్రవేశపెట్టడం అవసరం. కనీసం సెకండరీ స్థాయివరకు విద్యను నిర్బంధము, ఉచితం చేయాలి! అటువంటి

—తరువాత 11 వ పేజీలో





## అమ్మకము

10½ అ॥ తెంకసేకలు 80 సేకలు కలవు. కావలిసినవారు ఈ క్రిందివారిని సంప్రదించండి.

వి. రామారావు
వి. ఆర్. బ్రోకర్సు
16/448 అత్తితోట అగ్రహారం
నెల్లూరు ఫోను : 0880

## నెల్లూరు సబార్డినేటు జడ్జి కోర్టులో

I. A. No. 130/89

S. C. S. No 350/88

వంచిమండలం వి కటరమణరాజు
-పిటిషనరు/వాది

వరాల వాసవి W/O. వరాల బాబ్ రావు, ముత్తుకూరు రెస్పాండెంటు/
ప్రతివాది

అక్షేపణ నోటీసు

పై సంబంధిత పిటిషనరు పెట్టిన పిటిషను 3.8.90 తేది మీకు నోటీసు వాయిదా. పై తేదిన పదయం 10 గంటకు స్వయంగాగాని లేక వకీలుద్వారా గాని పై కోర్టులో హాజరై అక్షేపణలు తెలుపుకొనవలెను. లేనియెడల మీ పరోక్షమందే తీర్మానించబడును.

-జె లక్ష్మీనారాయణ, వాది అడ్వకేటు

## నంద్యాల డి॥ ము॥ కోర్టులో

E. P No. 233/87

O. S. No. 715/75

State Bank of India
Nandyal -డి. హో /వాది

Vs.

1) వక్కా అచ్చయ్య
2) మానుకొండ కృష్ణారెడ్డి
3) మానుకొండ అన్నపూర్ణమ్మ W/O. కృష్ణారెడ్డి
4) వక్కా రంగమ్మ W/O. అచ్చయ్య
-ప్రతివాదులు

3వ ప్రతివాది తా లూ కా షెడ్యూలు ఆస్థిని పై కోర్టువారివల్ల పైకోర్టు ఎదుట 14.8.90 తేది పగలు 10.30 గంటల నుంచి సా॥ 5 గం॥కు బహిరంగముగా వేలము వేయబడును. కావలసిన సవాలుదారులు కోర్టుకు హా జ ర యి సవాలులో పాల్గొనవచ్చును.

షెడ్యూలు

కర్నూలు డి॥ నంద్యాల సబ్ డి॥ దాపి రేవుల గ్రా మం లో ని 3వ ప్రతివాది తాలూకు స్థిరాస్థి వివరము సర్వే నంబరు 384, య 2.78 లు హె॥ 1.106. తూ॥ మా ను కొ ం డ కృష్ణారెడ్డి భూమి, ప॥ తియ్యగూర సుబ్బారెడ్డి భూమి, ఉ॥ చింతా సుందరరామిరెడ్డి భూమి, ద॥ మానుకొండ కృష్ణారెడ్డి భూమి.

క్రయం రూ. 8000/-
-ఇసుకపల్లి గురుమూర్తయ్య
వాది అడ్వకేటు, నంద్యాల



# సింహపురి

(4 వ పేజీ తరువాత)

బస్సులుమాత్రం రోడ్డులోనే ఆగుతున్నాయి. అన్నక్యాంటిన్ దగ్గర వున్న స్థలము, నిపో ఎదురుకు మార్చి, రెండువైపులా, రోడ్లను దూరంగా నిర్మించి ఏర్పాటు చేయగల్గితే లారీ ప్రమాదాలు తగ్గుతాయి.

### సర్వోదయ కాలేజి విద్యార్థి సంఘం

సర్వోదయ కాలేజి విద్యార్థి సంఘం ప్రారంభోత్సవం, నెల రో జు ల క్రితం, జనవరి 30 తేది జరిగింది. వెంకటేశ్వర విశ్వవిద్యాలయం రిజిష్ట్రార్ డాక్టర్ సత్య నారాయణ ముఖ్య అ తి థి గా వచ్చారు. ప్రిన్సిపల్ శ్రీ వి. మాధవరావు సభనధ్య క్షించారు. వి ఆర్ కాలేజి కామర్సు లెక్చరర్ శ్రీ పి. రవీంద్రరెడ్డి, పొదలకూరు కాలేజి లెక్చరర్ శ్రీమతి టి. సూర్యకళ మాట్లాడారు. విద్యార్థి సంఘాధ్యక్షుడు శ్రీ అనిల్ కుమార్ పమ పి జి సెంటర్లో సీట్ల సంఖ్య పెంచాలని, కనీస వసతులు కల్పించాలని కోరారు. శ్రీ సి. ఎల్. కాంతారావు నివేదిక చదివారు. విద్యార్థులు శ్రీ డి. శ్రీనివాసులు రెడ్డి, శ్రీ కె. శ్రీనివాసులు, శ్రీ జి. నారాయణ సభా నిర్వహణలో పాలుపంచుకున్నారు. ఇంగ్లీషు లెక్చరర్ శ్రీ నిర్మల్ కుమార్ స్వాగతవందనాలుచెప్పారు.

### కొత్త సేవా సంస్థ 'సేవాజ్యోతి'

నెల్లూరులో మరొక కొత్త సేవా సంస్థ వెలిసింది. 'సేవాజ్యోతి' అనే పేరు కల్గిన ఈ సంస్థను ఇటీవల టౌన్‌హాల్ రీడింగ్ రూంలో జరిగిన సభలో మాజీ ఎమ్మెల్యే శ్రీ కె వి సుబ్బారెడ్డి ప్రారంభించారు. పారిశ్రామికవేత్త శ్రీ జి జానయ్య సభనధ్యక్షించారు. శ్రీ పి సి. సుబ్బరాయుడు, పొదమేకల పుల్లయ్య, దూదల సంజీవయ్య తదితరులు మాట్లాడారు.

ఈసంస్థకు అధ్యక్షుడు శ్రీ జె. ఎల్. నారాయణ. కార్యదర్శిగా శ్రీ మునగా సంజీవరావు, ఉపాధ్యక్షులుగా శ్రీ సర్వేపల్లి ప్ర సా ద రా వు, శ్రీ పొదమేకల పుల్లయ్య, సంయుక్త కార్యదర్శిగా శ్రీ కోట కృష్ణమూర్తి, కోశాధికారిగా శ్రీ కలివిలి చంద్రయ్య నియమితులైనారు.

అనాథబాలలకు స్వయంఉపాధి చూపించడం, ఉచిత వైద్యశిబిరాలు నిర్మించడం వంటివి వీరి కార్యక్రమాలు.

### జెడాక్ నాటక పోటీలు

నెల్లూరు జ్యుడియల్ ఎం ప్లా యి స్ డ్రమటిక్ ఆర్ట్ క్రియేషన్స్ (జె డా క్( జూన్ 7 నుంచి 10 తేదివరకు నా టి క, ఏకపాత్రాభినయ పో టీ లు నిర్వహించనుంది. వివరాలకు వి. బాలసుందరం అధ్యక్షుడు, జిల్లాకోర్టు ఆవరణం అన్న చిరునామాకు వ్రాయాలి.

### హౌస్‌బిల్డింగ్ సొసైటీకి రాష్ట్రస్థాయి బహుమతి

నెల్లూరు సహకార గృ హ ని ర్మా ణ సంఘం, జిల్లాలో గృహనిర్మాణానికి చేసిన సేవకు గుర్తింపుగా రాష్ట్ర ప్రభుత్వం అవార్డు ప్రకటించింది. మొన్న రిపబ్లిక్ దినోత్సవంరోజు సొసైటి అధ్యక్షుడు శ్రీ ఆర్ ఎల్ నరసారెడ్డి, హైదరాబాదులో రాష్ట్రమంత్రి శ్రీ డి. కె. సమరసింహారెడ్డి చేతులమీదుగా షీల్డు, ప్రశంసా పత్రం అందుకున్నారు.

### చదరంగం పోటీలు

నెల్లూరు మహిళా చదరంగం సంఘం ఆధ్వర్యంలో మొన్నామధ్య వి ఆర్ డిగ్రీ కాలేజిలో జిల్లాస్థాయి పోటీలు చక్కగా జరిగాయి. జిల్లా అంతటినుంచి క్రీడాకారులు విశేషంగా పాల్గొన్నారు.

ప్రభుత్వ కళాశాల విద్యార్థి. వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఛాంపియన్ శ్రీ కె వేదానంద్; రామరమణుగు గ్రామస్తుడు ఎన్. సర్వేశ్వరరావు; పంచాయతీరాజ్ ఉద్యోగి శ్రీ టి. వి. పూర్ణచంద్రరావు ప్రథమ, ద్వితీయ తృతీయబహుమతులు పొందారు.

స్త్రీల విభాగంలో కలువాయి మండలం పెదగోపవరం పాఠశాల ప్రధానోపాధ్యాయిని కుమారి ఎస్. మంజుల, సర్వోదయ కాలేజి ఇంటర్ విద్యార్థిని కుమారి టి. రమాదేవి, ఇందుకూరుపేట గ్రామస్తురాలు కుమారి వై. ఉష బహుమతులు పొందారు.

బాలబాలికల వి భా గ ం లో వి ఆర్ హైస్కూలు విద్యార్థి కె. ప్రదీప్‌కుమార్, జె. ఎం. స్కూలు విద్యార్థి శ్రీ ఓ. సునీల్ కుమార్, పి ఎం ఆర్ ఎం స్కూలు విద్యార్థి ఎ ఆదిశేషశర్మ ప్రైజులు గెల్చుకున్నారు.

పొదలకూరు గ్రామస్తుడు, వి. ఆర్. కాలేజి విద్యార్థి శ్రీ శ్రీనివాసులుకు ప్రత్యేక బహుమతి లభించింది. నెల్లూరు మెక్లిన్స్ క్లబ్ బహూకరించిన రోలింగ్ షీల్డు, కప్పులను డి కె డబ్ల్యు కాలేజి ప్రిన్సిపల్ కుమారి వి. వరలక్ష్మి విజేతలకు పంచిపెట్టారు. టోర్నమెంట్ డై రె క్ట ర్ గా వ్యవహరించిన ఆల్ ఇండియా ఇంటర్ యూనివర్సిటీ చెస్ ఛాంపియన్ కె వ్హ ణ పీకపాటి రవికుమార్, చెస్ అసోసియేషన్ కార్యదర్శి శ్రీమతి టి. సూర్యకళ ప్రత్యేక మెమెంటో ప్రదానం చేశారు.

### సంగీత కళాకారుడికి మద్రాసు సంస్థ అవార్డు

నెల్లూరుకు చెందిన సంగీత కళాకారుడు శ్రీ వి. వి. శ్రీనివాసరావుకు, మద్రాసుకు చెందిన 'ది ఇండియన్ ఫైన్ ఆర్ట్సుసొసైటీ' బెస్ట్ వయోలనిస్ట్ అవార్డు ప్రకటించింది. వారు నిర్వహించిన దక్షిణభారత సంగీత సభా పండుగ ఉత్సవాలలో శ్రీనివాసరావుగారి వయోలిన్ వాద్యానికి, ఈ అవార్డు ప్రకటించారు. రేపు మార్చి 8 తేది మద్రాసులోనే జరిగే త్యాగరాజ ఆరాధనోత్సవాలలో దీనిని అందజేస్తారు.

శ్రీనివాసరావు నెల్లూరీయుడు; భాగవతార్, శ్రీ వాదరేవు సీతారామాంజనేయులు కుమారుడు ప్రస్తుతం రేణిగుంట సెంట్రల్ స్కూలులో మ్యూ జి క్ టీచరుగా పని చేస్తున్నారు.

### సి ఐ టి యు ధర్నా

సి ఐ టి యు ఆధ్వర్యంలో పి డబ్ల్యు డి, పంచాయతీరాజ్, ఆర్ అండ్ బి ఉద్యోగుల సంఘాలు 15 తేది కలెక్టరేట్ ఎదుట ధర్నా నిర్వహించాయి. వర్క్ చార్జడ్ ఉద్యోగులకు ప్రభుత్వోద్యోగులకిచ్చే సౌకర్యాలు వర్తింపజేయాలని; మూ డే ళ్ళ సర్వీసు వున్న ఎన్ ఎం ఆర్ లను రె గ్యు ల ర్ చేయాలని, ప్రభుత్వ శాఖల్లోని ఖాళీలను భర్తీచేయాలని వీరు కోరారు.

ధర్నాలో శ్రీ సి హెచ్ సు ధా క ర్, శ్రీ పి ఆదిశేషయ్య, శ్రీ కె సుబ్బారావు, శ్రీ ఎండి ఖయ్యూంబేగ్, శ్రీ డి శ్రీనివాసులు, శ్రీ ఎ నారాయణ తదితరులుపాల్గొన్నారు. ఉద్యోగుల సంఘం రాష్ట్ర నాయకుడు శ్రీ సి రామసుబ్బారెడ్డి ధర్నా నుద్దేశించి ప్రసంగించారు.

### కళామందిర్ నృత్య పోటీలు

నెల్లూరులో త్యాగరాజ ఆరాధనోత్సవాలను ప్రారంభించిన సంగీతకళాపిపాసి శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం తండ్రి స్వర్గీయ ఎస్ పి. సాంబమూర్తి సంస్మరణార్థం కళామందిర్ సంస్థ మార్చి 10 తేది రాష్ట్రస్థాయిలో జానపద నృత్యం,



12 తేది ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి చెన్నపురి పోయిన సందర్భంలో మోయలేని నిలువెత్తు పన్నీరు మాలతో సత్కరిస్తున్న మద్రాసులో వున్న నెల్లూరు కాంగ్రెస్ యువకుడు కేతిరెడ్డి జగదీశ్వరరెడ్డి

దటి. వివరాలకు కార్యదర్శిని సంప్రదించవచ్చును

### రోటరీ గవర్నర్ జె వి కి కామర్స్ ఛాంబర్ సన్మానం

రోటరీ గవర్నర్‌గా ఎన్నికై, ప్రపంచ రోటరీ గవర్నర్ల సమావేశంతో పాల్గొనడానికి అమెరికా వెళ్ళిన శ్రీ జె వి రెడ్డిని, నెల్లూరు జిల్లా ఛాంబర్ ఆఫ్ కా మ ర్స్ సంస్థ ఘనంగా సన్మానించింది.

సభను సంస్థ ఉపాధ్యక్షుడు శ్రీ జి వి రమణయ్య అధ్యక్షించారు. కార్యదర్శి శ్రీ వాహ్మిన సుబ్రహ్మణ్యం గ వ ర్న ర్ ను స్వాగతించి, స భ కు పరిచయం చేశారు. శ్రీ పి సి రె డ్డి, డాక్టర్ సి పి శా స్త్రి. రోటరీ క్లబ్ అధ్యక్షుడు శ్రీ డి భరత్ కుమారరెడ్డి, శ్రీ జి ఆర్ కృష్ణమూర్తి, శ్రీ వై శ్రీనివాసరావు తదితరులు మాట్లాడారు. శ్రీ జె వి రె డ్డి తన సన్మానానికి నెల్లూరులో ఐ ద్యాంక్ స్థాపనకు ఇతర దేశాలవారితో సంప్రదిస్తానని వాగ్దానం చేశారు.

### జిల్లా గ్రంథాలయసంస్థ ఉద్యోగులసంఘం కార్యవర్గం

నెల్లూరు జిల్లాగ్రంథాలయసంస్థ ఉద్యోగుల సంఘానికి ఎన్నికలు జ రి గా యి. అధ్యక్షుగా శ్రీ మోమిడి వెంకటేశ్వరరావు ఉపాధ్యక్షుడుగా శ్రీ ఎన్. రవీంద్రరావు, కార్యదర్శిగా శ్రీ డి. మునిరత్నంనాయుడు సహాయ కార్యదర్శిగా శ్రీ జి డి. శంకరయ్య, కోశాధికారిగా శ్రీ బి. శ్రీనివాసులు కార్యవర్గ సభ్యులుగా శ్రీ ఎ. అంకయ్య, శ్రీ ఎం. వెంకటరత్నం, శ్రీ షేక్ బాషా, శ్రీమతి బి. శారదాంబ, శ్రీ ఎ. గోవిందరెడ్డి, రాష్ట్ర సంఘం సభ్యుడుగా శ్రీ పి సుభాష్‌చంద్రగుప్త ఎన్నికైనారు.

★

## కావలి సబ్ జడ్జిగారి కోర్టులో

E. P. 66/88 O. S 89/80

ఇండియన్ బ్యాంకు నెల్లూరు వారు డి.హో.

Vs.

1) కర్తం క్రిష్టారెడ్డి 2) కర్తం యానాదిరెడ్డి 3) కర్తం బుజ్జిరెడ్డి-జె డి.లు

- యాలం ప్రకటన -

ఈ క్రింది షెడ్యూలు దాఖలా ప్రతివాదుల తాలూకు స్థిరాస్థిని పై కోర్టులో 13-8-90 తేది పగలు 10-30 గం॥ నుండి బహిరంగముగా వేలం వేయబడును. కనుక పాటదారులు ఆ దినం పై కోర్టులో హాజరై పాట పెట్టుకొనవచ్చును.

### SCHEDULE

Dry Lands situate in Gudavalluru alias Kondapuram Kavali taluk within the Sub-Registration area of Kavali Nellore Dit.

| S No. | Survey No | Full extent | Extent of A.c. | Mortgage Hec. | Amin's Value |
|---|---|---|---|---|---|
| 1) | 554 | 5-61 | 5-61 | 2.270 | Rs. 18000/- |
| 2) | 556 | 10-07 | 10-07 | 4.075 | 19500/- |
| 3) | 557 | 8-20 | 5 64 | 2.283 (undivided) | 5640/- |
| 4) | 558 | 3-26 | 2-97 | 1.203 (undivided) | 2970/- |
| 5) | 552 | 2-08 | 0-55 | 0.223 | 550/- |

East : Land of Gotham Venkatasubba Reddy and others South : Land of Sk. Jamal Saheb West : Government Poramboku North : Land of Syed Kadar Saheb

| S No. | Survey No | Full extent | Extent of A.c. | Mortgage Hec. | Amin's Value |
|---|---|---|---|---|---|
| 6) | 553-1 | 0-82 | | | |
| | 553-2 | 0-56 | | | |
| | | 1-38 | 0-46 | 0.186 | 460/- |

East ; Land of Sk. Jamal Saheb South ; Land of Gotham Venkatasubba Reddy West ; Land of Syed Kadar Saheb North : Upputeru

Total 25-30 10-240

వి. రామక్రిష్ణరాజు
డి. హో. అడ్వకేట్.-కావలి

# సినిమా ఖర్చు రెట్టింపైంది- ప్రేక్షకుల సంఖ్య సగమైంది!

అనేక కారణాలవల్ల గత పదేళ్ళ నుంచి తెలుగు చిత్రపరిశ్రమ దిగజారుతూ వస్తూన్న విషయం అందరూ ఎరిగినదే. విమాన రవాణాఖర్చులు, పెట్రోలు ధరలు పెరిగాయి. తారల పారితోషికాలు మరింత పెరిగాయి. మొత్తంమీద చిత్ర నిర్మాణ వ్యయం బాగా పెరిగింది. ఐదేళ్ళ క్రితం 20 లక్షలతో తీసిన చిత్రాన్ని ఇప్పుడు తీయాలంటే 80 నుంచి 40 లక్షల వరకూ అవుతోంది. ఆ చిత్రాల విజయాన్ని బట్టి చాలామంది కొనుగోలుదారులు తప్పుకున్నారు. అంతే కాకుండా ఇదివరకటిలాగా పాటల రికార్డింగ్ ప్రారంభోత్సవాలనాడు కొనుగోలుదారుల అడ్వాన్సులు ఇవ్వడానికి రావడంలేదు. కొత్తనిర్మాతలు సినిమా రంగం పూర్తయ్యేసరికి బాకీలు తీర్చేవరకు అయిపోవడంతో హైరానపడుతున్నారు, ఇలా వీరు అడ్వాన్స్ పడవలసివస్తోంది. దాంతో వాళ్ల

> **మద్రాసు సినిమా వార్తలు**

కష్టాయిష్టాలమీద ఆధారపడి చిత్రాల పూర్తిచేయవలసివస్తోంది. హిట్ అయిన ఏదైనా చిత్రంలోని కొన్ని సంఘటనలు తీసుకుని, దానికే మార్పులు చేర్పులతో కొత్తసినిమాలు తీయడంవల్ల ప్రేక్షకుల గతంలో లాగా ఆకర్షితులవడంలేదు; దాదాపు 80 నుంచి 40 శాతంవరకు థియేటర్లకు వెళ్ళే ప్రేక్షకుల సంఖ్య తగ్గింది. నిర్మాతలు జాగ్రత్తగా అడుగు వేయవలసిన సమయం ఆసన్నమైంది.

## ముఖ్యమంత్రి విజ్ఞత

ఫిబ్రవరి 12న రాష్ట్ర ముఖ్యమంత్రి ఎం. చెన్నారెడ్డికి మద్రాసులో ఘనంగా సన్మానం జరిగినప్పుడు తెలుగు చిత్ర ప్రముఖులెందరో ఆయన్ని కలుసుకున్నారు. "తెలుగు చిత్రపరిశ్రమకు చెందిన వారందరూ హైదరాబాదులో స్థిరపడి అక్కడే చిత్రాలు నిర్మించడానికి ప్రయత్నించాలి. ఐతే, చిత్రపరిశ్రమవల్ల ప్రభుత్వానికి ఆర్థికంగా ఎంతో లాభం చేకూరుతుందని భావించకండి, ఒక క్లాజ్ విషయం అంటారా? హైదరాబాదులో మూడు థియేటర్లు కలిగి - చిత్రపరిశ్రమకు చెందిన వ్యక్తే ముఖ్యమంత్రిగా వున్నప్పుడు క్లాజ్ పద్ధతిని ప్రవేశ పెట్టాడు. ఇాదులోనిమంచి చెడ్డలను క్షుణ్ణంగా పరిశీలించాకే నిర్ణయం తీసుకోవలసి వుంటుంది" అని నర్మగర్భంగా సమాధానమిచ్చారు.

## టి. వి. సీరియల్స్ ప్రచారం

తమిళనాడు, కర్నాటక, కేరళ, మహారాష్ట్రాలలో ఎక్కడైనా దూరదర్శన్ కోసం ప్రైవేట్ సంస్థలు తీసే సీరియల్స్ గురించి గాని, టెలిఫిలిమ్స్ గురించిగాని అంతగా ప్రచారమివ్వరు. ఆ దేశం దౌర్భాగ్యమోగాని ఇటీవల పలు తెలుగు పత్రికలలో టి. వి. సీరియల్స్ ప్రచారానికి ప్రత్యేకంగా రెండు మూడు కాలమ్స్‌నే

—తరువాయి 11వ పేజీలో



'మా ఇంటి కథ'లో మోహన్‌బాబు, వాణీవిశ్వనాథ్

# కాపీ చిత్రమైనా తెలుగుదనం కోల్పోలేదు!

# మా ఇంటి కథ

ఇది ఒక కుటుంబ కథాచిత్రం. కుటుంబంలోవున్నంతవరకు కలతలు, కలహాలు, విడిపోవటాలు, చివరకు కలిసిపోవటాలు పరిపాటిగా వుంటాయి.

నటుడు మోహన్‌బాబు సమర్పణలో అతని సోదరుడు ఎం. కృష్ణ నిర్మాతగా ముత్యాల సుబ్బయ్య దర్శకుడుగా విడుదలైన "మా ఇంటికథ" చిత్రంలోనూ కలహాలు, కొట్లాటలు చోటుచేసుకున్నాయి. ఈ కుటుంబంలో ఒక అన్న, ఇద్దరు తమ్ముళ్ళు, అన్నభార్య. తమ్ముళ్ళ భార్యలు ముఖ్య కుటుంబ సభ్యులుగా వుంటారు. అన్న గోపి (మోహన్‌బాబు) బాలామణివాడు. ఒక తమ్ముడు సుందరం (శరత్‌బాబ్), మరోతమ్ముడు రవి (సుధాకర్) ఒకరినిమించిన దుర్మార్గుడు మరొకడు. తన ఇద్దరు తమ్ముళ్ళను బాగా చదివించి అభివృద్ధికి తీసుకరావాలన్నది గోపి ఆశయం. కుటుంబపెద్దగా

> **చిత్ర సమీక్ష**
> గిద్దలూరు గోపాలరావు

అది తనధర్మం అని అందుకు బద్ధుడై నడుచుకుంటాడు కాని ఇద్దరు తమ్ముళ్ళ తోబుట్టువు అన్నవిధానికి విరుద్ధంగావుంటుంది. చెడ్డపనులుచెయ్యటం ఎన్ని హైరానాలైనాచేసి నష్టం తెచ్చిపెట్టడం తమ్ముళ్ళజీవితధ్యేయం, సుందరం ఒక అమ్మాయిని మానభంగం చేస్తాడు. కుటుంబ గౌరవం కాపాడేందుకు, తప్పుచేసిన తన తమ్ముణ్ణి తప్పించేందుకు తనమంచితనం వుపయోగించి మానభంగం చేయబడ్డ అమ్మాయినే సుందరానికిచ్చి పెళ్ళి చేయిస్తాడు గోపి. ఇలా తమ్ముళ్ళ తప్పులను కాపాడుకుంటూ వస్తుంటాడు. ఇద్దరు తమ్ముళ్ళు డబ్బుకోసం విగ్రహాలను స్మగ్లింగ్ చేసే దాసును (సత్యనారాయణ) హత్యచేస్తారు. గోపి మంచితనం ఎంతవరకు విస్తరించుకున్నదంటే తన తమ్ముళ్ళు చేసిన హత్యను తనమీద వేసుకొని జైలుపాలవుతాడు. తమను అదుపులో పెట్టే అన్న లేకపోవడంతో తమ్ముళ్ళ దుర్మార్గం ఎంత దురాక్రమణ చేసిందంటే చెప్పనలవి కాదు. అన్నభార్యను (వాణీ విశ్వనాథ్) ఆస్తికోసం కొట్టారు. ఆమె మతిచలించి పిచ్చిదవుతుంది, తమ అన్న కొడుకు రావురు కారణమవుతారు. ఆస్తి విషయంలో అతమ్ముళ్ళ సంబంధం చెడుస్తుంది. ఒకరిమీద ఒకరు కక్షసాధింపులకు దిగుతారు. ఈ ఇద్దరు తమ్ముళ్ళు వారి భార్యలు, వారిపిల్లలు సర్వనాశనం కాబోతున్న సమయంలో జైలునుంచి తిరిగి వచ్చిన గోపి అన్నీ సరిదిద్ది మంచికి మారుపేరుగా నిలుస్తాడు.

-తరువాయి 11వ పేజీలో



## భారతీదేవి ముంజేతి పాటపికము

"రసిక్"

మనదేశంలో
ఆమె గొంతు వినబడని
పల్లెగాని, పట్నంగాని, నగరంగాని
గుడిసెగాని, బల్లగాని, హర్మ్యంగాని
లేదని మనకందరకూ తెలుసు;
ఆమెగొంతు పలికించని, పలికింపలేని
[అది, అతిశ్రావ్యంగా, మనోహరంగా,
హృద్యంగా]
రాగంలేదు, శబ్దంలేదు, భావంలేదు;
ఆమె ఆలాపన గాంధర్వం
మన అందరి ప్రేలాపన అసురం;
"అయెగా... అయెగా... అయెగా"
అంటూ
ఆమె పాడుతూంటే
"ఆ జారే......" అని పాటలో
పిలుస్తూవుంటే
యక్ష, గంధర్వ, కిన్నెర, విద్యాధరాదిలోకాలు దిగివచ్చి, మనల్ని
చుట్టు ముట్టివేస్తాయి.
భూలోకమాలోకాలతో కలిసిపోతుంది;
దేవతలకు అమృతంలాగా,
మనకు టీ సిక్సలాగా
పాటయే ఆమె పానీయం.
అన్నంటాడా;
దాదాపు అర్ధశతాబ్దిగా
ఆ అన్నపానీయాలు తాను
పుచ్చుకుంటూ
మన మనసుల్లో అమృతం నింపుతూ
షష్టిపూర్తి జేసుకున్న
"భారతీదేవి ముంజేతి" పాట
పికము ఆమె;
విదేశ సందారంలో అమెగొంతు
విప్పగానే
ఆనంద తన్మయులైన సభికుల
అప్రయత్న
కరతాళ ధ్వనులజోరు ముందు
పనికిరావేనా సంయుక్త సప్త
సాగరముల హోరు!
రాష్ట్ర భాషావ్యాప్తి,
దేశ సమగ్రతా పరిరక్షణా,
అంతర్జాతీయ సౌహార్ద్రమూ
ఈ మూడున్నూ
ఆమెకే తెలియకుండా
వ్యక్తిత్వానికి "దాసి" ఖర్చులేకుండా
పత్రంగా సాగిపోతున్నవి.
అయినా ఆమెకుతగ్గ గుర్తింపు
మనమూ, మన ఏలికలు
ఇవ్వలేదనే ఘంటాపథంగా
చెబుతున్నాను.
"ప్రజాపాలన"తో, "ప్రజా సేవ"తో
అయితేనేమా
ప్రథమ తాంబూలమిచ్చేది మనం!
"ప్రజారంజన"కు చిన్నపీటేనా!
ఏలినవారి కంఠంలో పోస్తేనేగాని
సీసు తీర్థం కాకపోవచ్చు;
అయితేనేమి,
నిజమైన ఏలికలు ప్రజలే గనుక
సాటి ప్రజల తరఫున, కవిగా,
సత్కరిస్తున్నాను నిన్ను
ఈ "భారతీయరత్న" కిరీటంతో
అందుకో, ఓ సినాథసుతా!
అందుకో, ఓలా, ఓ సంగీత కల్పలతా!

# తారల పెళ్ళిళ్ళ ముచ్చట్లు

## సింగీతం కుమార్తె వివాహం

ప్రముఖ దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు కుమార్తె శకుంతలను సతీష్‌తో ఫిబ్రవరి 14న మద్రాసు విజయావాహినీ కల్యాణమండపంలో జరిగిన కల్యాణమహోత్సవానికి కమలహాసన్, చిరంజీవి, షావుకారు జానకి, వైష్ణవి, సుహాసిని, ఎస్. పి. శైలజ, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం ప్రభృతి చలనచిత్రరంగానికి చెందిన ప్రముఖులెందరో విచ్చేసి, వధూవరులకు శుభాకాంక్షలు అందజేశారు.

## రాజ్యలక్ష్మి వివాహం

"శంకరాభరణం" చిత్రం ద్వారా పరిచయమైన రాజ్యలక్ష్మికి పెళ్ళంటూ ఇదివరకు చాలా వార్తలు వెలువడ్డాయి. మొదట ఫిలిమ్ జర్నలిస్టు మిక్కిలినేని జగదీశ్‌బాబుతో పెళ్ళన్నారు. తర్వాత నటుడు శరత్‌బాబు పేరు వినిపించింది. చివరికి సింగపూర్ వాస్తవ్యుడైన కృష్ణ అనే యువకునితో ఏప్రెల్‌లో ఆమెకు వివాహం నిశ్చయమైంది. ఈ యువకుడు సింగపూర్‌లో వ్యాపారం చేస్తున్నాడట.

## రాజశేఖర్, జీవిత వివాహం

రాజశేఖర్, జీవిత ప్రేమించి పెళ్ళి చేసుకోబోతున్నారనే వార్తను ఇదివరకు వాళ్ళిద్దరూ ఖండించారు. ఇప్పుడు అదే నిజమని స్పష్టంచేశారు. పెద్దవారిని ఒప్పించడానికే ఇంతకాలం పట్టిందట. రాజశేఖర్ ప్రమాదానికిలోనై ఆస్పత్రిలో వున్నప్పుడు జీవిత చేసిన శుశ్రూషకు అతని తల్లిదండ్రులు సంతసించి, వారి వివాహాన్ని ఆమోదించారట.

## సులక్షణకు విడాకులు

సులక్షణ రాజమండ్రి వాస్తవ్యురాలు. ఆమెనుకన్నతల్లి పోషించలేకపోతే కల్యాణి అనే ఆమె చేరదీసి పెంచి, పెద్ద చేసింది. నాట్యం నేర్పించింది. సినిమాలలో అవకాశమిప్పించింది. డబ్బులు రాగానే సులక్షణ పెంచిన తల్లిని దూరంచేసుకుంది. సంగీత దర్శకుడు ఎం. ఎస్. విశ్వనాథన్ కుమారుడు గోపీకృష్ణను ప్రేమించి, పెళ్ళి చేసుకుంది. ఒక బిడ్డతల్లి అయింది కూడా. ఏం గొడవలొచ్చాయోగాని ఇటీవల భర్త విడాకులిచ్చాడు!

